# వి వా హ ము

ర చ న:

దు గ్గి రా ల క వు లు

నం ద మూ రు

ప. గో. జిల్లా.

# వి న తి

...oOo...

ఈ 'నివాళి' కృతికర్తలు శ్రీ దుగ్గిరాలకవులు మానందమూరు పుర వాస్తవ్యులు. శ్రీ వేంకటేశ్వర కరుణా కటాక్షమున బాల్యమునందే కవితాకళారాధన కుపక్రమించిన సోదరకవులు. మా పురమందు వేంచేసియున్న భక్తపరా ధీనుఁడు నస్మత్కులదైవమునగు శ్రీ వేంకటేశ్వరునికి జంట కవులుగఁ బ్రప్రథమమున వీరొసఁగిన యీ 'నివాళి' కృతిని ముద్రింపించుమని నన్నుఁ గోరిరి.

ఇంతకుఁ బూర్వము తూర్పుగోదావరిజిల్లా వీరవరము వాస్తవ్యులును, వైఖానసులు నగు శ్రీమాన్ పెద్దింటి కోదండ రామాచార్యులుగారు రచించిన శ్రీ నందమూర్వేంకటేశ్వర శతకమును 1939 వ సంవత్సరమున ముద్రింపించితిని. ఇదివర కొకమారచ్చొత్తింపఁబడి భావశీర్షికామాత్ర వ్యత్యాసముగల శ్రీ వేంకటేశ్వర స్తవమును దిరిగి ముద్రింపించు టెందుకని శంకించువారుండకపోరు. "ముఖేముఖే సరస్వతీ" అను నార్యోక్తి ననుసరించి వివిధకవుల కవితారీతులను గమనించు టవసరమనియు, ననంతగుణగణ్యుండగు భగవంతుని నామా మృతపానము తనివితీరనిదనియుఁ, బాపభూయిష్ఠమగు నిక్కలి యుగమున సంసారసాగర నిమగ్నులై దరిఁగానక చింతించు

పామరులు తరించుటకుఁ గలియుగాధినేతయగు శ్రీ వేంకటేశ్వర స్తవమును బహువిధముల ముద్రింపించిన మేలనియుఁ, దన్మూలమున నన్మాతృపితృవంశములును నా జన్మయుఁ దరించు మోక్షోపాయ మగుననియు నీ సత్కారమునకుఁ బూనుకొంటిని.

ఈ కృతిని ముద్రింపించుమని కృతికర్తలు పద్యరూప రూపమున నాకు వ్రాసిన జాబిందుఁ బ్రకటింపఁబడినది. నాకు సంస్కృతాంధ్రములందుఁ బ్రవేశమున్నను గవిత్వమబ్బనందున నిట్లు గద్యరూపమునఁ జదువరుల కెఱింగించితిని.

భక్తపరాధీనుఁడగు శ్రీ వేంకటేశ్వరస్వామి యీ జంట కవుల కితోధిక కవితాధోరణి, ఆయుర్భాగ్యములను బ్రసాదించుగాత !

ఇట్లు
వేపులపల్లి వేంకటరావు.

# మా మాట

భగవన్నామ సంస్మరణ కనువగు స్తవములు పలుకీతుల వలరారుచున్నవి. అయినను కేవలము భక్తిప్రధానముగ మా యిలువేలుపు, స్థానికదైవము వగు శ్రీ వెంకటేశ్వరున కీ "నివాళి" ని మే మొసగుచున్నాము.

సంస్కృతాంధ్ర సారస్వతోపాసకులు, వదాన్యులు న.ల శ్రీ దేవులపల్లి వేంకటరావుగారు మాజాబుచూచినంతనే మాయందుఁగల వాత్సల్యపురస్సరముగ నీకృతి వచ్చోత్తించుట కుద్యమించిరి. శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి దీర్ఘాయురారోగ్య ములను ప్రసాదించుగాత!

తక్కువ వ్యవధిలో నెక్కువ యాకర్షణీయముగా నీ కృతిని ముద్రించిన శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్ వారికి మా ధన్యవాదములు. ఎంత జాగ్రత్తగాఁజూచినను ముద్రణాప్రమా దము లతిస్వల్పముగాఁ గానవచ్చినవి. గ్రంథాంతమునఁ గల తప్పొప్పులపట్టికను పాఠకులు గమనింతురు గాక!

ఇట్లు

దుగ్గిరాల కవులు.

శ్రీకర! సర్వమానవ వశీకర! నీరదనీలవర్ణ శో
భాకర! శ్రీమనోంబుజ ప్రభాకర! సద్గుణపుంజరత్న ర
త్నాకర! భక్తవారిధి సుధాకర! రాక్షసభంజన ప్రయ
త్నాకర! సజ్జనోద్ధరణ తత్పరశేఖర! వేంకటేశ్వరా!

గురువగు చెళ్ళపిళ్ళ కవికుంజరు పాదసరోరుహాలకున్
గరములుమోడ్చి; పండితుఁ డఖండుఁడునా పితృదేవునెమ్మదిన్
స్మరణయొనర్చి; నీదుకరుణాబలమూఁతగనూని, నీపదాం
బురుహాయుగంబుపై శతకమున్ విరచింతుము; వేంకటేశ్వరా!

అతుకులబొంతమాదిరిగ నల్లియుబొల్లియు నల్లి యేదియో
శతకము వ్రాసినా' రని రసజ్ఞులు హేళనసేయకుండ, వి
స్తృతమృదుమాధురీ రసవిశేషకవిత్వ సుధాసుధార్ద్రకై,
స్తుతియొనరింతుమెంతయుఁ జతుర్ముఖురాణిని; వేంకటేశ్వరా!

సరసవికుంఠపట్టణపు సౌధములన్ విడనాడి, ప్రీతితో
ధరకరుదెంచి, భూజనవితానముఁ బ్రోచుచు, నందమూరులోఁ
దిరుపతికొండపై నొకగతిన్ నివసించుచు, భోగమూర్తివై
వరలెడి నీపదంబులను బాయకగొల్తుము ; వేంకటేశ్వరా !

ఎంతటిపుణ్యముల్ సలిపి యెట్టితపంబులు సేసినామొ ? జ
న్మాంతరమందు మేము ; మునినాథులకైనను గానరాని నీ
వెంతయుఁ బ్రీతితోడ వసియించఁగ మించెడి నందమూరు గ్రా
మాంతమునన్ వసించి చరితార్థులమైతిమి ; వేంకటేశ్వరా !

పుట్టినవాడఁగా నలిగిపోతిమి, మాయపిశాచి పాదసం
ఘట్టనలం గడు ; నీదుశతకమ్ము రచించి రవంతపుణ్యమున్
గట్టుకొనంగ నేఁడు సమకట్టితి, మెట్టులో పాపభూతమున్
నెట్టిననెట్టివేయఁ, దుదనెగ్గఁగఁ జేయుము ; వేంకటేశ్వరా !

కాయము ఖాయమే ? తలఁపఁ గాలుఁడు నిత్యముఁ దోడునీడయై
వాయకయున్నవాఁ ; డెపుడు ప్రాణముఁదీయునొ ? చెప్పలేము ; 'నా
రాయణ' యన్నమాటయిన రా దసువుల్ విడనాఁడునాఁడు ; దే
వా ! యిపుడే మనాన నినుధ్యానము సేతుము ; వేంకటేశ్వరా !

నీదయ చేతనే కద! జనించిన దీ కవనమ్ము; దీనిచే
నీదగు సచ్చరిత్రము ననేకవిధమ్ముల సన్నుతించి, యి
మ్మేదిని మే మొనర్చిన యమేయమహోదురితోపసంఘమున్
మోఁది, విముక్తిఁ గాంతుము, ప్రమోద మెలర్పఁగ, వేంకటేశ్వరా!

శ్రీరమణీశ! నిన్నెపుడుఁ జిత్తమునం దలపోయుచుండినన్,
జేరవు పాపసంఘములు; చేరరు భీకరకాలకింకరుల్;
దీఱని దుఃఖమెల్లఁ గడతేఱును; నారకకారకంబు సం
సారసముద్ర మీఁదుటకు శక్తియుఁ గల్గును; వేంకటేశ్వరా!

శ్రీకరుణావిభూష! మునిసేవిత సన్మహిమావిశేష! శో
భాకరనీలగాత్ర! సుజనావళి సన్నుతసచ్చరిత్ర! ల
క్ష్మీకలితోరువక్ష! దివిజేశ్వర వైరివిపక్ష! లోకర
క్షాకమనీయ కార్యకృతకౌతుకమానస! వేంకటేశ్వరా!

హరి! జలజాక్ష! అచ్యుత! అనంత! అనంగసమానసుందరా!
సరసిజనాభ! చక్రధర! శాంతివిభూషణ! సాధుపోషణా!
కరివరదా! కృపానిలయ! కైటభమర్దన! ధర్మవర్ధనా!
పరమపవిత్రగాత్ర! పరిపంథిబలాంతక! వేంకటేశ్వరా!

ఇంద్ర సరస్వతీంద్ర ప్రముఖేంద్ర సమర్చిత పాదపంకజా!
సంద్రగభీరధీర! గతసాహసధైర్యవిరోధినాయకా!
సాంద్రతరానురాగ! విలసన్నుత మంగళచారు విగ్రహా!
చంద్రకళాధరాప్తసఖ! చంద్రునిస్వాలక! వేంకటేశ్వరా!

అజుఁడవునీవ, నీవ రజతాచల వాసుఁడ, వాహలాయుధా
నుజుఁడవునీవ, కశ్యపతనూజుఁడవీవ, సుమిత్రపుత్రకా
గ్రజుఁడవునీవ, యాపరశురాముఁడవీవ, నభంబునీవ, యీ
త్రిజగమువీవ, దేవ! కలదే! యొకభేదము; వేంకటేశ్వరా!

నీదయచేతనే యసురనిర్జరలోకము కంథిఁ ద్రచ్చి సం
పాదనచేసినారు, మృతిఁబాపెడి మందును; పంకజాప్తచం
ద్రాదిసమస్త భూతనిచయమ్ములను సేవొనరించు నాజ్ఞనే
యాదలఁదాల్చుచుందురనయమ్ము నయమ్మున; వేంకటేశ్వరా!

ఒక్కఁడు శంకరుండనుచు, నొక్కఁడు పంకజనాభుఁడంచు, వే
ఱొక్కఁడు బ్రహ్మయంచు, మఱియొక్కఁడు వహ్ని, జలంబు
వాయువున్
జుక్కలఱేఁడు నింద్రుఁడని సూర్యుఁడటంచు వచింత్రుగాని, నీ
నిక్కము రూపమిట్టిదను నేర్పరులెవ్వరు? వేంకటేశ్వరా!

చక్కెరతిన్ననోరు తినఁజాలునె ? చేదగు వేపపండ్లు; నీ
చక్కని నామసంస్మరణ సారమెఱింగినవాఁడు పోవునే ?
తక్కినవేల్పులంగొలువఁ; దక్కినవేల్పులఁగొల్వ మోక్షమున్
జిక్కునె ? మ్రొక్కుదండుగగుఁ, జెప్పఁగనేటికి ? వేంకటేశ్వరా!

తమ్ములవీడి తుమ్మెద ముదమ్మున వ్రాలునె ? రెల్లుపూలపైఁ ;
గమ్మనిలేఁజిగుళ్ళ నవకమ్మునువీడి పికమ్ము తుమ్మయా
కిమ్ముగ నారగించునె ; మహిన్ భవదీయకథామృతంబు బా
నమ్మొనరించు నాతఁడశనమ్మును గోరునె ? వేంకటేశ్వరా !

కాసులు పిల్లకాసు లరకాసులు నిచ్చెడి శక్తిలేదు ; నీ
దాసుఁడనంచుఁ జెప్పికొని, తావక పాదయుగాన కెప్పుడున్
జేసెద, నశ్రుబిందువులచే నభిషేకము ; గావుమయ్య ! నీ
దాసులలో నొకండఁ బరదైవమెఱుంగను వేంకటేశ్వరా !

నేనొక వట్టిమూర్ఖుఁడను, నీకు సపర్యలు సేసి మోదితుం
గానొనరింప భీష్ముఁడనుగాను, సనందుఁడఁగాను, మారుతిన్
గా, నసురాత్మజాతుఁడనుగాను, నిజంబుగ నంబరీషుఁడన్
గాను, దయామయా! యెటులుగాచెదవో? నను; వేంకటేశ్వరా!

కంజదళాక్ష ! నీపదయుగమ్ము సపర్యలు సేయ మాకడన్
మంజుల సౌరభాంచిత ఘుమంఘుమ పద్మసుమాలు లేవు, మా
మంజుల మాధురీరస సమంచిత పద్యసుమాలమాలచే
రంజిలు పూజ సేతుము కరమ్మనురక్తిని ; వేంకటేశ్వరా !

శక్తికొలంది నీచరణసన్నుతిచేసితిమయ్య ! యెన్నఁ డ
వ్యక్తతతో భవత్పదసపర్య లుపేక్ష యొనర్ప లేదు, మా
భక్తికి నేమికాని, తమపాదములన్ మది నమ్మినందు కీ
రిక్తులపై సదా చిలకరింపుము నీదయ, వేంకటేశ్వరా !

ఈవు కృపారసమ్ము నొకయింతఁ బయిన్ బయిఁ జిల్కకున్నచోఁ
దైవతభర్త యుద్ధమున దైత్యకులాధిపతి ప్రతానమున్
జేవ నెదిర్చి చీల్చి దివిజేశుతనంబు వహింప నేర్చునే ?
ఆ విభవమ్ము వీడి చనఁడా వనవాటికి వేంకటేశ్వరా !

కొమ్మకుఁ గొమ్మకున్ దుముకు కోఁతికి దుస్తర సాగరమ్ము ధై
ర్యమ్మున దాటుశక్తి గలదా ! యిలదాని నెఱుంగమా ! విచి
త్రమ్మగు కార్యమున్ సలుపఁ దావకభూరి కటాక్షనొక సా
యమ్మొనరించి యుండును యథార్థమదే కద వేంకటేశ్వరా

సాటిగఁదూఁగఁ జాలవొక సత్యవచస్సున కశ్వమేధముల్
కోటియుఁగూడ; నట్టియతిలోక పవిత్రపు సత్యవాక మున్
దాటి, రణావనీస్థలినిఁ దాల్చితిచక్రముఁ గౌరవేయులన్
గీటణగించి ధర్మజునకే గెలుపీయఁగ ; వేంకటేశ్వరా!

నీతిపథమ్మునన్ నడచునేతలఁగావఁదలంచి కాదొకో
సూతుఁడవైతి దేవవిభుసూనున కాలమునందు, లేని-చో
జీతమ! బత్తెమా! పరులసేవలు సేసినఁగాని పొట్టనిం
పే తెరువుండదా? తమ కమేయ దయామయ! వేంకటేశ్వరా!

అనవరతమ్ము నీస్మరణకన్న మతేమి యెఱుంగనట్టి స
జ్జననిచయమ్ము మోక్షముయశమ్మునుఁబొందుట యబ్బురంబొకో?
పనిగొని నీపదాల్ గొలుచు భక్తుల భక్తులభక్తులైన ము
క్తినిగని లోకవంద్యులను కీర్తినిగాంచఁగ ; వేంకటేశ్వరా!

పరమపవిత్రగాత్ర! తమభక్తుల కెగ్గుఁదలంచు దుష్టులం
దఱుఁబడుపాట్లు కుక్కలకు నక్కలకున్ దెలియంగవచ్చు, మే
మెఱుఁగమె? యంబరీషు నెదిరించిన తాపసిపొందు దుర్గతిన్;
నిరుపమభక్తవత్సల! మునీశ్వరవందిత! వేంకటేశ్వరా!

శాంతివాఙ్ళక్కి, భూతదయ సాంతముగా నశియించె, సత్య మా
వంతయు లేదు, ధర్మ్మము రవంతయు లే, దిఁక దైవభక్తియా
యంతమునందె, గంగఁబడె నార్యజనార్చన, యంతకంతకున్
వింతగఁ దోఁచుచుండెఁ, బృథివీతలమంతయు, వేంకటేశ్వరా ?

ప్రబలెను జీవహింస ; యెటుప్రక్కఁ గనుంగొనినన్ దురాత్ములై
యబలలఁ బాడుచేసి, శిశుహత్యలు చేసి, గృహస్థులందఱిన్
గబగబ వీథికీడ్చి, తమకత్తులఁ గుత్తుకలుత్తరించి, యిం
డ్లఁ బరశురామప్రీతినిఁ బొనర్చెడివారలె ; వేంకటేశ్వరా !

కలదుకదా! యటంచు నొకకానియు దానము చేయకుండఁ గ
న్నులు తలకెక్కిపోవఁగఁ గనుంగొనఁడక్కట ! సుంతయేని దీ
నులుపడుపాట్లు; కాలుఁడు-తనున్ గడుబాధలు పెట్టునంచుఁ దాఁ
దలఁపఁడు మానవాధముఁ డెదన్ జగదీశ్వర ! వేంకటేశ్వరా !

కలిమియుఁ జుట్టపక్కములుఁ, గన్నకుమారులు, భార్య, నిత్యమున్
నిలచెదరన్న మాయను మునింగి, యముండు కలండటంచు భీ
తిలక, త్వదీయనామము మదిన్ స్మరియింపక, పాపవహ్నిలో
పలఁబడి దగ్ధమానుగద ! పాపి, నిజంబుగ, వేంకటేశ్వరా !

చాలినయట్టి తిండిఁ దినజాలరు, చాలినబట్టఁ గట్టఁగాఁ
జాలరు, బీదవారిగని జాలివహించరు, బొందిలోని రో
గాలకు రాగికానియును ఖర్చునొనర్పరు, లేకిపీనుఁగుల్ ;
కాలముతీరిపోవ వెనుకన్ ధనమేగునె ? వేంకటేశ్వరా !

పరధనమన్న మన్ను, పరభామయనన్ దనుగన్నతల్లి, యి
ద్ధరఁగల సర్వభూతములుఁ దాననిఁ, నెమ్మది నమ్మువాఁడెపో
యరయఁగఁ బండితుండు; మఱియన్యుఁడు తానెటువంటిజ్ఞాన సం
భరితుఁడునైనఁగాని యొకపామరుఁడేయగు ; వేంకటేశ్వరా !

పరపతిలేని మానవుఁడు ప్రాణములేని కళేబరమ్ముతో
సరియగు ; సిగ్గులేనియొలజవ్వని క్రొవ్విన యూరపందితో
సరియగుఁ ; దల్లిదండ్రులను సర్వసపర్యవిధాన మోదసం
భరితులఁజేయఁజాలనికుమారుఁడు-మూర్ఖుఁడు ; వేంకటేశ్వరా !

పలువురు సజ్జనుల్ గని సెబాసు సెబాసు సెబాసటంచు ని
చ్చలుఁ దనవర్తనమ్మును బ్రశంస యొనర్చెడి రీతిగా మనం
గల నరుజన్మ జన్మమగుఁగాని మఱొక్కరి జన్మ జన్మయే !
తలపఁగఁ బుర్వుకన్నఁగడుఁదక్కువ జన్మము ; వేంకటేశ్వరా !

ఎప్పుడో ? యెక్కడో ? యముఁడనేకవిధమ్ములఁ ముప్పుతిప్పలన్
దప్పకపెట్టునన్ నుడులు తప్పుడుమాటలుకావె ? దైవమా !
ఇప్పటిలోకమే నరక, మిప్పటివారలె కాలకింకరుల్,
ముప్పులమూట యీకలివిభుండె యముండిఁక, వేంకటేశ్వరా !

తనువును యౌవనంబును ముదావహమైనటువంటి భోగముల్
ధనమును దల్లిదండ్రులును దారయుఁ బుత్రులు శాశ్వతంబులే ?
ఘనమగు ధర్మమున్ యశము గాక ! నరుండు తిరంబులైన త
ద్ధనములు పొందెనా ? యితరద్రవ్యములేటికి ? వేంకటేశ్వరా !

తల్లియుఁదండ్రియున్ గురుఁడుదైవము సర్వమునీవెయంచు మా
యుల్లములందలంచితి, మహామహుమైనటువంటి మాయలన్
ద్రెళ్ళఁగఁజేసి, జ్ఞానము సమృద్ధిగనిచ్చి, దయామయుండవై
చల్లనిచూపుచూడు మనిశమ్ము భృశమ్ముగ ; వేంకటేశ్వరా !

కాటికిఁ గాళ్ళుచాపియును గామములన్ గెలువంగలేఁడు త
న్నాటకపాత్రనింక విడనాడఁగ సమ్మతిఁ జూపలేఁడు, మీ
మాటఁ దలంపఁబోడకట ! మాయలదోగిన మానవుండు పా
పాటవి దాటిపోవుటకు బాటలభించునె ? వేంకటేశ్వరా !

ఘాతుకకృత్యముల్ సలుపఁగాఁ గడునుత్సుకులై చరించుచున్
నీతినిఁ గోలుపోయి యవినీతికిఁబాల్పడినట్టి దుర్జన
వ్రాతము క్రిందుమీఁదుగఁ దపంబొనరించునుగాక నీకృపా
పాత్రులుకారు కారని సవాలొనరింతుము వేంకటేశ్వరా!

చిత్తము చిత్తమంచుఁ దమసేవలుసేయక కత్తిఁగట్టి నీ
చిత్తము మార్చఁగల్గునొకొ౦చిచ్చరకంటియునైన; గాన నా
తత్తరపాటునైచి దయఁదాల్చి విపన్నుఁడఁబ్రోవుమంచు గొం
తెత్తి నుతించుచుంటిఁ; గరుణింపుము నాపయి వేంకటేశ్వరా!

తోరముఁగట్టుకొంటివఁట! దుర్భరదుస్సహ దుష్టశక్తి సం
హారమొనర్చి సద్గుణసమంచిత సాధుజనావనైక దీ
క్షారతినేలుచుందుఁ ద్రిజగమ్ములనంచు; భవత్కృపాసుధా
ధారలుగాక దిక్కుకలదా! భువనాలకు వేంకటేశ్వరా!

కోరఁగలేదు సంపదలు, కోరఁగలేదు నితాంతసౌఖ్యముల్
గోరఁగలేదు స్వర్భువనకోటులు, కోరఁగరానికోరికల్
గోరఁగలేను, కోరితిమి కూరిమితో భవదీయపాదపం
కేరుహచింతనంబుఁ; గలిగింపుము మాకది వేంకటేశ్వరా!

చంచలచిత్తుఁడన్ జడుఁడ స్వార్థపరుండను గామలోభమో
హాంచితవర్తనుండను మదాంధుఁడ మందమతిన్ మనుష్యుఁడన్
జంచదనూన తావక విశాల మహామహిమా విభూతి వ
ర్ణించఁగ నెంతవాఁడఁ గరుణింపుము నాపయి; వేంకటేశ్వరా!

ధృతిఁ జెడి యుంటి నాయఘములెల్ల హరింపుము దేవదేవ! అ
చ్యుత! యని వేడికొంటి దయయుంచవదేమిటి? పెద్దలెల్ల నా
శ్రితజన వత్సలుండ వని చెప్పెడిమాటలు బూటకంబులా!
గతి యిఁక లేక నీపదయుగంబును బట్టితి వేంకటేశ్వరా!

తప్పదు నీ లలాట లిఖితమ్మని ప్రార్థనఁ ద్రోసివేసినన్
జెప్పఁగలేను; కాని తమచిత్తములోఁ గరుణాసుధారసం
బుప్పతిలంగ నడ్డమగునో విధివ్రాఁతలు వానిచేఁతలున్;
దిప్పలుపెట్టకయ్య! ప్రణుతించి నుతించెద వేంకటేశ్వరా!

కనుమిరుమిట్లుగొల్పెడి ప్రకాశముతోడఁ గిరీటహారదలన్
దనరఁ జతుష్కరంబుల గదాది మహాయుధముల్ సెలంగఁగా
మునిజనమోదకారక మమోఘమునైన త్వదీయరూపమున్
గనుగొనునట్టి భాగ్యమనఘా! యొనఁగూర్పుము వేంకటేశ్వరా

పవలును గాంతివంతముగ భానుఁడు సేయును, రాత్రినంతయున్
బ్రవిమల కాంతివంతముగఁ బద్మవిరోధి యొనర్చు, వంశగౌ
రవమును గాంతివంతముగ రమ్యగుణుండు రణుండు సేయు, ధ
ర్మవు భువనాలనెల్లను వెలుంగఁగఁజేయును వెంకటేశ్వరా !

స్వార్జితమైన విత్తమది సర్వవిధమ్ముల నుత్తమమ్ము పి
త్రార్జితమైన సొమ్మొకవిధమ్మునఁ జూడఁగ మధ్యమమ్ము భ్రా
తార్జితమైన ద్రవ్యము యథార్థముగా నధమంబు భార్యచే
నార్జితమైన పైక మధమాధమమే యగు వేంకటేశ్వరా !

విత్తముఁ బాత్రమున్ సతులు వేఱొక హస్తములోని కేగినన్
వత్తురఁటన్న నమ్మకము వట్టిదియే ; యొకవేళ వచ్చినన్ :
బాత్రమొ! చెత్తయౌను, ధనమో! ఒకసారిగ రాదు, భామయో!
బాత్రిగ భ్రష్టురాలగు నమోఘము లియ్యవి వేంకటేశ్వరా !

దానము లేని విత్తము నిదానములేని ప్రవర్తనమ్ము సం
తానములేని యిల్లు రచనా నిపుణత్వములేని విద్య సో
పానములేని మేడ హరిభక్తతలేని ప్రసూతి భక్తిసం
ధానములేని అర్చన వృథా కద ! యెన్నఁగ వేంకటేశ్వరా !

తరుణవయస్సునందుఁ బెడదారులు త్రొక్కెడు మందబుద్ధితో
నరకమొ! స్వర్గమో! యెఱుఁగనట్టియొకానొకకూపమందు ముం
దెఱుఁగక కూలియుంటి; గలదే? యిఁక వేఱొకదిక్కు నాకు నీ
వరకరుణాకటాక్షపరివారము తక్కిన వేంకటేశ్వరా!

ఇరువది యేండ్లప్రాయమునకే తలపైఁబడె దుస్తరమ్ము దు
ర్భరము కుటుంబ భార; మొకప్రక్కను మిక్కుటమై విపత్పరం
పరలు తగుల్కొనెన్; బ్రతుకవచ్చునె? యిట్టియవస్థలోన నే
నరునకునైన నీదుచరణమ్ములుపట్టక వేంకటేశ్వరా!

శైశవమాది నీచరణసారసయుగ్మ సపర్యతప్ప మా
కాశయ మొండులేదుగద! ఆపదలోఁగల భక్తులన్ గృపా
లేశముచేతఁగాచు తమలీలలకున్ గడుదూరమైతిమా?
ఆశలుద్రెంచి వేయఁదగునా! తమబోంట్లకు వేంకటేశ్వరా!

ఆశ దురాశయాటయు-దురాశ నిరాశకు దారితీసి యు
ద్దేశము మారిపోవుట-మతిభ్రమణంబు-సదా పృథావ్యథా
వేశము-దుంపనాశనము: వీనికిమించి ప్రపంచ సృష్టిలో
లేశము సౌఖ్యమైనఁ గనలేముకదా! మఱి; వేంకటేశ్వరా!

ఉన్నది యున్నయట్టులు ప్రభూ ! తమముందఱ విన్నవించి కూ
ర్చున్నది మాదుచిత్తము ; దయోదయమైనది నిన్ను గాతు తె
మ్మన్నను గాని లేవ దభయంబు నొసంగదొ ? కాలదన్నెదో ?
అన్నిటికిన్ సహించఁగఁ దయారయియున్నది వేంకటేశ్వరా !

నా యిలువేల్పటంచు నిను నమ్మినదానికటోయి ! యింత య
న్యాయముఁ జేయుచుంటి కరుణాభరణా ! శరణాగతుండఁ జే
దోయి మొగిడ్చి నీ యడుగుదోయికడన్ దలయొగ్గి వేడినన్
రాయివలెన్ రవంతయుఁగరంగదు నీమది వేంకటేశ్వరా !

ఆపదలోన నుంటిఁ, దమ యాదరమున్ మదిఁగోరుచుంటి, సం
తాపముఁబాపుమంటి,దయఁదాల్చి విపన్నుఁడఁబ్రోవుమంటి నా
పాపమదేమొ ? నా మనవిఁ బాలనఁ జేయవు తోయజేక్షణా !
నాపయిఁగోపమా! నుతగుణా ! తగునా! యిది వేంకటేశ్వరా !

ఇంత దయామయుండనని యింతటి దీనజనావనుఁడనం
చింతటివాఁడనంచు మది నెంచఁగఁ బోకుము : వడ్డికాసులన్
బంతము మీఱఁబుచ్చుకొని పైఁగృపఁజూపెడి లంచగాఁడ ! నీ
తంతు విపన్నుఁడే యెఱుఁగు ధారుణిలోపల వేంకటేశ్వరా !

లచ్చిగలాఁడ! కర్కశకరాళశిలామయ పర్వతంబుపై
బొచ్చునకాసఁజేసి ముకువుల్ గ్రహియించుచు నుందువేల? యు
ష్మచ్చరిత ప్రబంధమహిమాన్విత ఘట్టములన్ గ్రహింపఁ గా
వచ్చునె? పార్వతీహృదయ వల్లభుఁడైనను వేంకటేశ్వరా!

మొసలిని గెల్వఁజాలను నమోనమ కేశవ! పాహి! పాహి! యం
చనువులఁ బాయనున్న ద్విరదాధిపుఁ బ్రోవఁగఁ బర్వులెత్తుచోఁ
బస దనరార నీయురముపైఁ దగ నృత్యము చేయుచుండి సం
తసిలెడి వైజయంతిని ముదంబునఁ గొల్తును వేంకటేశ్వరా!

వందనమిచ్చెదన్ బ్రళయవహ్నిశిఖానిచయోపమప్రభా
బృంద సమస్తవైరిజనభీకరధారవిదారితాసురా
క్రందనద్రిగ్దిగంతర జగద్విదితైకపరాక్రమోందిరా
మందిరమా సుదర్శన సమంచితమూర్తికి వేంకటేశ్వరా!

కొండలు పిండిఁజేసెడి యకుంఠపరాక్రమ విక్రమక్రియా
దండితశత్రుతండమయి, తావక భూరిబలాఢ్యమౌ భుజా
దండముమీఁద మెండయినదర్పముతో వెలుఁగొందు నీ గదా
దండముకున్ బ్రియంబలర దండముపెట్టెద వేంకటేశ్వరా!

సుకవి కవిత్వముఁం గని యసూయను బట్టఁగలేక దానిపై
వెకిలి విమర్శనల్ సలుపు పీతిడి కాకవిమూక శిక్షణముల్
చకచక చెండివైచి యణచంగల తావకఖడ్గరాజమున్
సుకవితతోడ మేమెపుడు స్తోత్రము సేతుము వేంకటేశ్వరా !

రాజకళాధరాజ సురరాజముఖామర లోకమాన్యమున్
రాజదఖండ నిస్వనపరాజిత రాక్షసరాజసైన్యమున్
సైజకృపావిధూత శరణాగతదైన్యముఁ బాంచజన్యమున్
బూజలొనర్తుమయ్య! యఘముల్ నశియింపగ వేంకటేశ్వరా !

భూరిమదాసురేశ్వర సమూహవిజృంభణకాలవహ్ని చ
ల్లార దిగంతపూరితగుణారవభీకర ఘోరగర్జన
స్ఫారధగద్ధగద్ధగిత పాండురకాంతి నిశాతసాయకా
సారయుగాంత మేఘమగు శార్ఙ్గముఁ గొల్తుము వేంకటేశ్వరా!

అంబుజగర్భునుండి నిగమాలిని దొంగిలి సోమకాసురుం
డంబుధిలోన దాగఁ గనులాసనుఁ డంతట నిన్ను వేడ మీ
నంబుగ వార్ధిఁజొచ్చి యల నాకవిరోధిని సంహరించి వే
దంబులు వేధకిచ్చిన విధానఁ గృపన్ గను వేంకటేశ్వరా !

అమృతముకై సురల్ దితిజులంబుధిఁ ద్రచ్చఁగఁ బర్వతంబు సం
ద్రమున మునుంగ దేవతల ప్రార్థనఁ గైకొని కూర్మమూర్తివై
ప్రమదమున మోపి మందరధరాధరమున్ పయికెత్తినాటి నీ
విమలదయారసంబుఁ గురిపింపుము మాపయి వేంకటేశ్వరా !

సరసిజగర్భు మెప్పున ననల్పవరమ్ములనంది దుష్టుడై
ధరణినిఁ జాపజుట్టి వడిదానిని సంద్రమునందుఁ ద్రోయఁగా
దొరకొను హేమలోచనునిఁ ద్రుంపఁగ సూకరమై జనించి యీ
ద్ధరణినిఁ గాచినట్టి నిను ధ్యానము సేతుము వేంకటేశ్వరా !

మాధవుభక్తి మానుమని మాలిమితాలి కుమారుఁ జంపఁగా
నాధనఁజేయునట్టి దివిజారినిఁ బట్టి నృసింహమూర్తివై
క్రోధమునన్ వడఁజీల్చి జముప్రోలికి గాఁపరిగానొనర్చి ప్ర
హ్లాదునిఁ గాచినట్టి నిను బ్రార్థన చేతుము వేంకటేశ్వరా !

బలిమును నాకసేశ్వరుఁడు ప్రాగ్వరముఖ్యులఁ బాఱద్రోలిఁ దో
ర్బలమున నాకమున్ గెలువ వామనరూపున భిక్షుకుండవై
బలిని నధోగతిన్ బడఁగఁ బాదమునన్ దిగద్రొక్కి స్వర్గమున్
వెలయ బలారికిచ్చిన త్రివిక్రమ ! కావుము వేంకటేశ్వరా !

బల్లిదులై ప్రచండ పరిపాలనఁజేయుచు రోజురోజు వ
ర్థిల్లు నిరంకుశత్వమునఁ గ్రిందుపడిమీఁదును గానకున్న భూ
వల్లభకోటులన్ దునుమ భార్గవరాముఁడవై జనించి యీ
తల్లి భరమ్ముఁ బాపి, యుగధర్మము నిల్పితి వేంకటేశ్వరా!

దశరథుపుత్రకుండవయి తాపసి జన్మముగాంచి సీతమా
ననము హరించి ఘోరవిపినమ్ములకేగి ఖరాది దుష్టరా
క్షసులఁజంపి వానరుల సాయముతో నల రావణాసురున్
నుసిమసి చేసినట్టి నిను మన్ననఁజేతుము వేంకటేశ్వరా!

ప్రల్లదులైన కంస శిశుపాల జరాసుత దంతవక్త్రులన్
ద్రెళ్ళఁగఁజేయ దేవకికిఁ గృష్ణుఁడవై జననంబునంది ప్రే
పల్లెను వృద్ధియై పుడమిభారముఁ బాపిన రుక్మిణీమనో
వల్లభ! మామనంబుల నివాసము చేయుము వేంకటేశ్వరా!

భూతదయాదిహీనులయి పొట్టను నింపుకొనంగ జీవహిం
సాతిమిరంబునం బడెడి మానవకోటుల నుద్ధరింపఁగా
గౌతమబుద్ధతన్ బ్రజలకంతట బౌద్ధమత ప్రచారమున్
బ్రాతిగఁజేసినట్టి నిను బ్రార్థనచేతుము వేంకటేశ్వరా!

వాహవమెక్కి చేతఁగరవాలముఁదాలిచి దుర్నిరీక్ష్య రా
ద్రారఘటిన్ దురాత్ములశిరంబులు పండినతాటిపండ్లు నా
ఘాహుణి వ్రాల్చ జేయుచును ధర్మమునిల్పెడి కల్కిమూర్తివీ
వాహయ నీపదంబులకు నంజలిమోడ్తుము వేంకటేశ్వరా!

నవ్వుమొగంబునందు నటనంబొనరింపఁ గృపావిలోకనల్
నివ్వటిలంగ నీవు కరుణించిన యప్పటిమాటకాని దా
దవ్వులనున్నఁ ద్వద్విరచితాగ్ని పరీక్షకు నాగఁ జాలువాఁ
డెవ్వఁడయా! చరాచరమహీపలయమ్మున వేంకటేశ్వరా!

కక్షవహించి ద్రౌపదికిఁ గట్టిన పుట్టములొల్వఁ గౌరవా
ధ్యక్షుఁడు సిందుకొల్పినఁ బ్రయత్నమొనర్పదయామయుండవై
యక్షయమాగతిన్ వలువలాసతికిన్ దయచేసి మానసం
రక్షణమాచరించిన పరాత్పర! కావుము; వేంకటేశ్వరా!

రాతిని నాతిఁజేసి సచరాచరసర్వజగత్తునందుఁ బ్ర
ఖ్యాతివహించినట్టి భవదంఘ్రితలంబును మ్రొక్కి మోక్షల
క్ష్మీ తరుణీమణీహృదయజీవనజాత సరోజమిత్రులౌ
పూతచరిత్రులన్ గొలువఁ బోయెద మేయెడ వేంకటేశ్వరా!

పుట్టినదాది నీదు పదముల్ మదికిన్ ముదమారఁబట్టమున్
గట్టితినయ్య ! ఆర్తికలుగన్ బొనరించిన విన్నపంబు నా
కొట్టెదవంచు, నీదగు నకుంఠదయారస వీక్షణంబు జో
కొట్టునటంచు ; మోముఁ గడకొత్తకు నన్ గని వేంకటేశ్వరా !

పట్టెడు కూటికై పరులపంచ శ్రమించి తపించునట్టి యీ
కట్టడి జీవియొక్క బ్రతుకంతయు గండములేకదయ్య ! యీ
పుట్టుకకర్థమేమి ? ముదమున్ సుఖమున్ గనుచూపుమేరఁ జూ
పట్టవు క్రిందుమీఁదుగఁ దపంబొనరించిన ; వేంకటేశ్వరా !

నీవు వసించునూరున జనించుటయే కడుభాగ్యమంచు సం·
భావనఁ జేసికొంటిని ; భవత్పదపద్మయుగార్చనంబె నా
జీవన జీవనంబనుచుఁ జిత్తములోఁ దలపోసికొంటి ; రా
జీవదళాక్ష ! నా బ్రతుకుఁ జెట్టలఁ బెట్టకు వేంకటేశ్వరా !

ముడుపులనీయలేను మొగమోటము లేటికి ? నున్నదున్నటుల్
నొడివెదఁ జిత్తగించి కరుణోదధివై నను గావుమంచు ని
న్నడిగెదనయ్య ! ఆశ్రితజనావనుఁ డన్నది సార్థకంబుగా
బడుగుపయిన్ దయన్ జలికి పాలనఁ జేయుము వేంకటేశ్వరా !

దుడుకుఁదనంపుఁ బోకడలతోఁ బెడదారులఁబట్టిపోవు నా
వెడగుఁదనమ్ము సైచి యరవిందదళేక్షణ! నీకటాక్షమున్
బిడికెడు బిచ్చమేయుమని పేరిమి మీఱఁగ జోలికట్టి ని
న్నడుగుచునుంటి నంతవెగటా! ననుజూడవు వేంకటేశ్వరా!

దడదడలాడుగుండెలు, సదా మదిలో నెదియో యశాంతి తా
గడబిడ సేయుచుండును, ముఖాముఖి చెప్పుదమన్నచోఁ గనం
బడవుకదయ్య! నాకుఁ; దలఁపన్ దమవీనులలోనఁ జొచ్చునే
ముడుపులనీయలేని యొక ముచ్చిరిమాటలు వేంకటేశ్వరా!

గడుసుఁదనమ్ము లేదు సరిగా నొకయాపదవచ్చినన్ హడా
విడి యొనరించుటే తెలియు, వేయువచింపఁగ నేలనయ్య! నీ
యడుగులునమ్ముకొన్న శరణాగతుఁడన్ గయిమోడ్చుచుంటినీ
బడుగుని జీవితంబు నగుబాటొనరింపకు వేంకటేశ్వరా!

గడగడలాడుచుండుఁ ద్రిజగమ్ములు నీకడకంటఁగెంపు క
న్పడిన, భవత్కటాక్షలవభాగ్యవశంబున నెంతయున్ సుఖం
పడును; భరింపరాని యిడుముల్ గుడువన్ దడబాటు మేరమీ
ఱెడు వెడగున్? ననుం గనికరింపుము నిచ్చలు వేంకటేశ్వరా!

దారియుఁ దెన్నునున్ దెలియరాయె మహాశయ ! ఈయసారసం
సార కవీంద్రకల్పితవిషాదకథానిక పాత్ర ధారణా
భారము నిర్వహింపఁ దమపాదయుగమ్మును నమ్ముకొంటి జో
హారులనందుకొమ్ము శరణార్థిని గావుము వేంకటేశ్వరా!

మోయుటెటుల్ కుటుంబభరమున్, వరమున్ గరుణింపు
మోయి ! మా
ప్రాయమదెంత యింతటి యవస్థలు తట్టుకొనంగఁ దాళలే
మోయి ! భవత్కటాక్షనిచయోద్ధత సత్కరుణారసాపగా
తోయముఁ జిల్కుమోయి ! ప్రణుతుల్ పచరింతుము
వేంకటేశ్వరా !

దోసములున్న నాయెడ నెదో విధిగా సరిపెట్టుకొమ్ము కై
సేసెద నీదు పాదసరసీరుహముల్ గయిమోడ్పుపూలతో ;
దాసులొనర్చు నేరములు దండముతో సరియన్న వాక్యవి
న్యాసమెఱుంగవే ? యది యపార్థము చేయకు వేంకటేశ్వరా!

కారములేని కూర సహకారములేని వనంబుఁ దొల్త నోం
కారము లేని మంత్ర మధికారములేని మనుష్యుఁడున్ జమ
త్కారములేని మాట మమకారములేని సవిత్రి తైలసం
స్కారములేని కేశములు సన్నుతికెక్కవు వేంకటేశ్వరా !

మనసుకు శాంతిలేదు సుఖమన్నదిలేదు ప్రపంచమందుఁ బు
ట్టినదినమందునుండి యొక వేగతి మాగతిసాగె జీవితం
బనిన విరక్తి పుట్టెఁ దమయంఘ్రియుగంబును పూజచేసినం
దునకు ననంతయాదరముతోఁ బరికింపవె వేంకటేశ్వరా!

హారతులందుకొమ్ము కరుణాభరణా! శరణన్నవాని జో
హారులనందుకొమ్ము మధురాతిమనోజ్ఞకవిత్వమల్లికా
హారములందుకొమ్ము అభయంబునొసంగి మదీయకష్టసం
హారమొనర్పవే? మదికిహాయినొసంగవె! వేంకటేశ్వరా!

నీరదకోమలాంగ! నవనీతసమానదయాంతరంగ! శృం
గారగుణాలవాల! త్రిజగత్పరిపాలన కార్యలోల! బృం
దారకవైరివైరి! ద్విరదాహితనక్రమదాపహారి! జో
హారుశతమ్ముఁగొమ్ము కరుణాకర! శ్రీకర! వేంకటేశ్వరా!

నారదతుంబురాది మునినాయకవందితశారదాభ్రడిం
డీరతుషారశారదపటీరఫణీశపయోధికందముం
దారమరాళరాజ రజతాచలధౌతకళావితానవి
స్ఫారవిరాజితామలవిశాలయశోధర! వేంకటేశ్వరా!

దండము నీకు నప్రతిహతప్రతిభాప్రకట[illegible]రదండకో
దండకళాప్రవీణ ! సముదాత్తపరాక్రమ[illegible]మదదా
దండసమాశ్రితాంస ! లలితస్మితధౌతకళ[illegible]తవే
దండభయాంధకారబలదర్పసుదర్శన[illegible]



శ్రీయలవేలుమంగవివశీకృతచిత్తసరోజ ! ఓ జగ
న్నాయక ! ఓ సమస్తభువనస్తవనీయయశోవిశాల ! ఓ
న్యాయపథానుసార ! గరుడాసన ! పాలిత పాకశాసనా !
ఓయభవా ! యనంత ! యసురోద్ధృతిభంజన ! వేంకటేశ్వరా !

వాసము నందమూరు, సహవాసులు వెల్మదొరల్, కవిత్వ మ
భ్యాసము, పొట్టకూటికయి యాంగ్లము నేర్చి స్వజాతియోగ్యమౌ
వేసము మార్చికొంటి మవివేకము సైచుము దండమో ప్రభూ !
దాసులొనర్చు నేరములు దండముతో సరి వేంకటేశ్వరా !

శతకము వ్రాసి నీచరణసన్నుతిఁ జేసిన కష్టమంతయున్
నితయగునే మహాత్మ ! కురిపించితివీవు కృపారసమ్ము వి
స్తృతముగ మాపయిన్ ; గిసలయించెను నేటికి మా మనోరథ
ప్రతతి కృతజ్ఞతాంజలి భవత్పదపంక్తికి వేంకటేశ్వరా !

మీరు సమిత్తమాత్రులు, కవిత్వము చెప్పెడి శక్తివంతులే
కారు, భవత్కటాక్ష మనఁగా సుకుమారకవిత్వధారణా
ధోరణితోడ నిశితకధోరణినాగె; భవత్కృపాసుధా
ధారలె పేరి నవ్యకవితామృతధారలు వేంకటేశ్వరా!

మంగళమయ్యె! నీ విమల మంజుల మంగళ చారుమూర్తికిన్
మంగళమయ్యె! నీ శ్రితజనావన పావన నిత్యదీక్షకున్
మంగళమయ్యె! నీదు కరుణారసపూరిత చిత్తవృత్తికిన్
మంగళమయ్యె! నీ పదసుమాలనుమాలకు; వేంకటేశ్వరా!

సంపూర్ణము.

---



# దేవులపల్లి వేంకటరావుగారు

వెంకటరాయ! విశ్వజనవిశ్రుతకీర్తిశశాంకచంద్రికా
లంకృత దిగ్విభాగ! శుభలక్షణ! శాంతిరసార్ద్రవీక్షణా!
వెంకటకృష్ణసత్కవి కవిత్వపయోధితరంగమండలై
కాంక! వదాన్యతాది సుగుణాంచిత! శీలకళాసమంచితా!

తిరుపతికొండ నాఁదగు నతిప్రతిభాయుతమైన నందమూ
ర్పురముననుండు వేంకటవిభున్ వినుతించుచు బాల్యమందునన్
విరచనఁ జేసియుంటిమి భువిన్ గలకాలమునిల్చు సద్యశ
స్కరమగు వేంకటేశ శతకమ్మును; కమ్మని తెల్గుకైతలో.

ఈపనిఁ బూర్తిచేసి గణియింపఁగ నేటికి దాటిపోయె దా
దాపుగ నాలుగేఁడులు; వృథాపడియున్నది మాదు కబ్బపుం
బాప గృహమ్ములోనఁ, దమవంటి మహాత్ముల ప్రాపునందియె
ట్లో ప్రమదమ్ముతోఁ బ్రజలలోఁబడఁగావలెనంచు నెంచుచున్.

కృతులు రచింపఁ జాలిన యదృష్టము మా నుదుటన్ లిఖించి ము
ద్రితములు చేయఁ జాలిన యదృష్టముఁ బెట్టఁడు మాలధాత ; త
త్కృతికి భవాదృశుల్ సుకృతులెందఱొ పుట్టిరటంచు నేమొ? మీ
మతిఁ దలపోసి చూడుఁడొక మాఱు యథార్థము తేటతెల్లమా.

అడిగితి మేమొకప్పుడు సహాయము సేయుఁడటంచు ; దానికి
ప్పుడు సమయమ్ము కాదనిరి ; పుస్తకమచ్చుని పేరుఁబెట్టి మే
మడుగుటె కాని దానికగు నర్థవ్యయంబది యెంత వండ బైఁ
బడునె ? తలంపఁ దొంటికిఁ బైబడ ; దయ్యది మీకు లక్ష్యమే.

వారిని వారి వారి మఱి వారిని వారినిఁ గోరి తద్ధనా
ధారముతోడ ముద్రణకు దారినిఁ జేయఁగవచ్చు ! గాని మా
కోరికకున్ విరుద్ధమను కొమ్మది ; దేవులపల్లి వారికే
గౌరవమీఁదలంచి యడుగన్ వలసెన్ మిము మాటిమాటికిన్.

దేవుని ప్రస్తరంబగుట 'దేహి' యటన్నను తప్పులేదు ; మీ
రావిషయమ్ము నిల్పఁడకున్నను చిన్నతనమ్ము లేదు ; మీ
భావము 'కాదుకూడ' దనిపల్కుడు దేవునికార్యమన్నచోఁ ;
గావున వ్రాసియుంటి మిది కాదనలేరను నమ్మకమ్ముతో.

నివాళి

'ఈయసమానసత్కృతికి నెవ్వరుపాల్పడిరో యొవ్వరో
యీ! యెవరోయి! యంచు నెవ రేనడుగన్ మరి 'వారలా! ఫలా
నా' యని మేము చెప్పుకొనునాడుకదా! మన ... పేరు ...
మీ యశమున్ దిగంతముల మేదినిపై విహరించి ...

మాకును మీకు వేలుపును మా! అల వేంకటనేత, యట్టి ను
శ్లోకుని పై రచించితిమి సుందర మాశతకమ్ము కందు మీ
రాకృతినచ్చు వేయగ నిరాదృతిఁజూపిననాడు మిమ్ములన్
లోకమునవ్వ, మమ్ముఁ గవిలోకమునవ్వ, నిజమ్ము సద్గుణీ!

కవులన్ గన్నది 'నందమూర'నుచు నాకల్పాంతమున్ నిల్చు గౌ
రవమున్ దెచ్చును 'దుగ్గిరాల'; కవినారాధించి పోషించు భూ
ధవులన్ గన్నది 'నందమూర'నుచు విద్వాంసుల్ ప్రశంసించు గౌ
రవమున్ 'దేవులపల్లి' తేవలయు బారావార మధ్యాంతమున్.



*                *

ఈవిధి మేము జాబు లిఖియింపఁ దదంతరభావమెంచి మో
దావిలచిత్తుఁడై శతకమచ్చునకిచ్చిన మేటిదాత మా
దేవులపల్లి వంశజుఁడు ధీనిధి వెంకటరావు తాఁ జిరం
జీవియనామయుండయి వసించుత! వేంకటనేతసత్కృపన్.

— దుగ్గిరాల కవులు

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 5 | హాలాయధా | హాలాయుధా |
| 4 | 8 | త్రిజగముఏవ | త్రిజగములేవ |
| 5 | 7 | కథామృతంబుబా | కథామృతంబుఁబా |
| 9 | 1 | దినజాలరు | దినఁజాలరు |
| 16 | 11 | ద్రిగ్దంతర | దిగ్దంతర |
| 18 | 6 | జుట్ట | జుట్టు |
| 19 | 5 | జన్మ్మము | జన్మము |
| 19 | 7 | ఋషుల జంపి | ఋషులను జంపి |
| 19 | 13 | దయాదహీను | దయావిహీను |
| 21 | 6 | కట్టడి | కట్టిడి |
| 22 | 16 | వేంటకటేశ్వరా ! | వేంకటేశ్వరా ! |
| 24 | 14 | పయోది | పయోధి |
| 26 | 2 | మనఁగా | మునఁగా |
| 29 | 12 | వలయు బా | వలయుఁ బా |

ఇంకను గొన్నిచోట్ల నరసున్న లంటినట్లులేదు. అట్టి యత్యల్పదోషములను సవరించుకొను భారమును తమపై వదలినందుకు సహృదయులగు చదువరులు మమ్ము మన్నింతురుగాక.

దుగ్గిరాల కవులు.